



in you

యము.

# సూక్తిరత్నావళి.

ఇది

శ్రీమత్కౌశికగోత్రపవిత్ర, నరహర్యాచార్యపుత్ర,

అమరవాది - వేంకటాచార్య

విరచితము.



మొదటికూర్పు



కాకినాడ:

శ్రీ సావిత్రీ ముద్రాక్షరశాలను ముద్రితము.

1916.



వెల 1 అణా.

## Motto. I.




## A U M.

Preserve Tejas (Ananda, Joy) in you and in the circles you move.

ఓం

నీవు ఆనందింపుము. పరులను ఆనందింపఁజేయుము.

నీవు సంచరించు చోట్ల తేజోహాని కానీయకుము.



## Motto. II.

## A U M.

Spend not beyond your means.
Lay by something for your necessaries.
Honourably live in devotion and purity.
Become a gnani, a prapanna; and enjoy eternal happiness.

ఓం

ఆయముమించిన వ్యయముసేయకుము.

ఉచితధనము నిలువచేయుము.

దైవభక్తి, యోగ్యత, (గౌరవము) కలిగియుండుము.

జ్ఞానివి, ప్రపన్నుఁడవు, నిత్యసంతోషివి అగుము.



# Universal Mottoes.

# సర్వసమ్మతాదర్శములు.

జనములకు నిర్మలానందము ప్రధానము.

అందులకు సాధనములు:—యోగ్యత, తృప్తి, జ్ఞానము, భక్తి, వైరాగ్యము. నిర్మలానందమునకు ధనమే ప్రధానమనుట పామరభ్రాంతి.

'ధనమూల మిదంజగత్'

'అతిసర్వత్ర వర్జయేత్'

అనుటంబట్టి యెల్లరు నుచితధనమును న్యాయమార్గముననార్జించి, యోగ్యతగల్గి, జ్ఞానభక్తి వైరాగ్యములచే నమితధనాశను గుదించి, తృప్తిఁజెంది, స్వధర్మములనెల్ల శ్రద్ధావినయభయ భక్తులతో జరపుచు, పరమార్థమునకే యంటునట్లు సంచరించి, క్రమక్రమమున నిర్మలానందము పొందవలెను.

కాకినాడ, 7-5-1916.

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
అమరవాది వెంకటాచార్యులు.

# సూక్తిరత్నావళి.



## బుధజనస్తుతి.

( ఖ్యాంజుస్వాము. )

1 జనమ్ములన్ దలంచెదన్ - ఘనమ్ములైనరీతులన్
మనమ్మునందునీడకెపుడు - మాన్యదేవుఁగొల్చునా ॥ జన ॥

2. రెండులోకములయందు - నిండుమోదమందుచుండి
దండిగాఁగనుండఁగలు - ధన్యగణ్యకీర్తులౌ ॥ జన ॥

3 పండితాళిమెచ్చునట్టి - భవ్యదేవురూపుచేన
ఖండలీలనుంచునట్టి - ఘనులునమితసుగుణులౌ ॥ జన ॥

4. అమరవాది వేంకటార్య - విమలమతికిఁబ్రీతిఁగొల్వ
సమతమెలఁగుచుండునట్టి - సౌమ్యపుణ్యులైనయా ॥ జన ॥

హిందూస్థానీభైరవిరాగము—ఆదితాళము.

మామకకృష్ణ - మంగళమిదేగొను.

1. దేవకీబిడ్డఁడవు - దివ్యస్వరూపుఁడవు
పావనమూర్తివి - పాలించుదేవుఁడవు ॥ మా ॥

2. గజ్జెలమ్రోఁతల - ఘల్లనుపాదములు
ముజ్జగములకు - మ్రొక్కఁగమోదములు ॥ మా ॥

3. మురళీగాన - మూర్తిమంతుఁడవు
శరణనువారిని - జక్కఁగనేలెదవు ॥ మా ॥

4. భక్తులపాలిటి - పారిజాతమవీవు
ముక్తినొసంగెదు - మురహరరంగఁడవు ॥ మా ॥

5. అమరవాది వేంక - టార్యపాలకుఁడవు
విమలగురుండవు - వేదాంతవేద్యుఁడవు ॥ మా ॥



శ్రీ సద్గురుభ్యో నమః

# సూక్తిరత్నావళి.



## ఆర్యాస్తుతిః




కరముగ బ్రహ్మాండము
లాకారమ్ముగనుగల్గి ♦ యంచితకేళిం
బ్రాకటమహిమ వెలింగెడు
లోకాతీతుం భజింతు ♦ లోలుండనగుచున్. 1

క. వీలో! చాలో! యేలో!
మేలో యీలీలలింక ♦ మేల్మేలంచున్
గీలించుభక్తనాయిక
లీలా కేళీవిలాసు ♦ లీలల నెంతున్. 2

క. మెప్పుగొని భక్తగణముల
కెప్పుడు భగవద్విలాస ♦ మెలమిఁ దెలుపుచున్
దప్పక యానందమిడెడు
నప్పున్ గంధాళిగురుల ♦ కంజలి సేతున్. 3

తే. గీ. కృష్ణజనకుం బ్రేమతోఁ ♦ గొనియెంచి
సమ్మ్రభక్తురామానుజు ♦ నెమ్మిఁగొలిచి
వ్యాసువాల్మీకిఁ దిక్కన ♦ నలఘుపోత
నాఖ్యనెంచెద మద్వాణి ♦ యలరుకొఱకు. 4

క. ఆర్యన్ సంస్కృత విద్యా
వార్యన్ గాంధర్వగాన ♦ వరకీర్తియుతో
దార్యున్ గురుజనకుశర
ణ్యార్యున్ జ్ఞానిన్ బ్రపన్ను ♦ నాత్మభజింతున్. 5

తే. గీ. నిత్యమును దేవుస్మరణాన ♦ నెగడుసాధ్వి
పేదసాదులదయఁజూచు ♦ పేర్మియువతి
నోటనన్నృతమ్ముఁవలుకని ♦ బోటిమిన్న
యైన జననిని సీతాంబ ♦ నభినుతింతు. 6

తే. గీ. ప్రేమ గౌరవ భక్తిని ♦ వెలయుసాధ్వి
మాదుజనకుని తోఁబుట్టు ♦ మాన్యచరిత
యైన వోలేటి మంగమాం ♦ బా వధూటి
నెదఁ దలంచెద నామది ♦ ముదముచెంద. 7

క. భగవత్ప్రేమన్ విలసిత
సగుణాంచితభక్తిరూప ♦ సాయుజ్యాకళా
ధిగతుఁడగు వేంకటార్యుని
నగణితభక్తిపరిసారు ♦ నన్నదలఁతున్. 8

తే. గీ. అమరవాదికులాంబుధి ♦ యందుజనన
మాట దివ్యపుస్తకసార ♦ మంతయెఱుఁగు
మాకు మేనత్తయనఁగను ♦ మహిని బరఁగు
కీరవట వేంకమాంబనేఁ ♦ గోరితలఁతు. 9

తే. గీ. తీరికగ దివ్యదేశము ♦ ల్తిరిగివచ్చి
నింటఁ బదిమందిభుజియింప ♦ నిచ్చగించు
పెంచ్చులోకోపకారుం ♦ మెచ్చు మామఁ
గీరవట నృసింహార్యు నేఁ ♦ గోరియెంతు. 10

తే. గీ. శాంతమిలరూపుఁదాల్చినా ♦ జరుగునింతి
మాకు గృహలక్ష్మినిచ్చిన ♦ మాన్యచరిత
యైన వేంకటాంబను మది ♦ నభినుతింతు
సంతసముతోడ హృద్వీథిఁ ♦ జక్కనిల్పి. 11

భగవద్విషయము.

తే. గీ. పనిని జేయక ధనకోట్ల ♦ ఫలముఁగనుట
వ్యాధి జరలేక తళతళ ♦ వఱలుచుంట
యెప్పుడానందమగ్నుఁడై ♦ యెసఁగుచుంట
జనులు మెత్తురసాధ్యమీ ♦ సరణిఁగనుట. 12

క. తళతళమనియెడు దేహ
మ్ములతో నానందలీల ♦ మోదాత్మకులై
చెలువారు పరమపదముఁ
వెలయంగని తెలిపిరిలకు ♦ వేద్యమతార్యుల్. 13

క. దేవుఁడు గలఁడే చూపుటన్
జీవమహానందమతఁడు ♦ చిన్మయ తేజం
బీవింత దేహధర్మము
లీవిధులా తేజమునకు ♦ లేశము లేవౌ. 14

క. అమ్మహిత తేజమందున
నిమ్ముగ లోకమ్ములన్ని ♦ యిముడుచునుండెన్
గ్రమ్మి యదిజగతినిండుగ
ముమ్మాటికిఁ గలదుకలదు ♦ మఱి చెప్పఁగాంతిన్. 15

క. ఆకాంతినె విష్ణుండని
యాకాంతినె శివుఁడటంచు ♦ నాత్మమతములం
బ్రాకటముగఁ బూజింతుర
నేకములగు మార్గములను ♦ నీభువియందున్. 16

క. యోగులు యోగముచేతను
బాగుగ భక్తులును భక్తి ♦ ఫణితులచేతన్
లోఁగనుఁగొందురు దేవుని
బైఁగనురూపముల మొదటి ♦ పరరూపమ్మున్. 17

క. దేహమనోవక్రిత్వము
లూహించుచు మాన్పుబెట్టు ♦ లోనరునోయనుచుం
బాహాటమ్ముగ జనులకు
దేహమనోనియమనములు ♦ దెల్పిరి ప్రాజ్ఞుల్. 18

గీ. మనమునకు నామకీర్తన ♦ మంత్రజపము
లాదిజెప్పిరి దేహాన ♦ కమితనిష్ఠఁ
జెప్పి రుపవాసములఁ జేయఁ ♦ దేఁటగాను
వాని నొనరింపఁగా మేలు ♦ వచ్చుఁ బ్రజకు. 19

క. ఆగమవిధ్యుక్తములిల
నేగతిఁబోధించుచుండె ♦ నేర్పడనట్లే
తోఁగక చరింపఁగాఁదగు
బాగగు ఋజుధర్మమార్గ ♦ ఫణితులనెందున్. 20

## లౌక్యము.

తే. గీ. మనము చేసిన మేలుచే ♦ మహితసృష్టి
యెంత తేజమ్ముఁ గాంచునో ♦ యంత మనము
తేజమొందఁగనుందుము ♦ తెలియదెటులో !
యెంత దుఃఖమ్ము గూర్చిన ♦ నంత దిగులు. 21

తే. గీ. సృష్టిజాలంబు భిన్నమై ♦ చెలఁగుచుండు
దానిఁగని దేవుమహిమమ్ము ♦ దలఁపవలయు
చేతనైనంత యుపకృతి ♦ సేయవలయు
ప్రీతి నిరసించుచుండుట ♦ పెద్దతప్పు. 22

తే. గీ. విషయమనములఁ గట్టుగాఁ ♦ బ్రీతినుంచ
కుంట తప్పని మనవారు ♦ గొప్పమతము
లెన్నొ కృపఁదెల్పఁగా వాని ♦ నన్ని విడిచి
స్వేచ్ఛమతమును గల్పింపఁ ♦ జెనఁటితప్పు. 23

తే. గీ. ద్వైతమును వైష్ణవమ్మన ♦ ద్వైతమతము
లన్నియొక్కటె బొట్లచే ♦ వన్నెమీఱి
సర్వప్రేమయయుఁ బరమార్థ ♦ సమతఁగనక
కక్షలను బక్షపాతమ్ముఁ ♦ గాంచఁదప్పు. 24

తే. గీ. యోగ్యతగన్పడఁగాఁగోరు ♦ టొప్పునెందు
తనయహంభావమునుగోర ♦ దండితప్పు
దానిఁబోషింపుమనికోరి ♦ తనరఁదప్పు
దైవభక్తియు జనులందు ♦ దయయెమేలు. 25

క. తనకిట్టులుండఁగావలె
ననుమాటకు నర్థమేమొ ♦ యగుపడదిలలోఁ
జననీతిధర్మపద్ధతి
యనుకూలంబగునుగాదె ♦ యదిజనములకున్ 26

క. తనకొఱకె యెప్పడెంచును
తనతనతనయంచునెపుడు ♦ తల్లడమందున్
తనతనతనయననేమిటొ ?
తనయనఁగానెవ్వఁడుర్విఁ ♦ దనునేతానా ? 27

క. దూరపుదృష్టియు సూక్ష్మం
బారయఁబామరులుచాల ♦ రవనీస్థలిలోఁ
జేరికనట్టిదిగనుకనె
కారణమయ్యెంధరిత్రి ♦ గజిబిజిపడఁగన్. 28

క. తానేగోతంబడెనో
జానుగనాగోతిలోన ♦ జనులం ద్రోయన్
బూనికయత్నము సేయును
మానుగఁ గపటాత్ముఁడైన ♦ మనుజుం డెప్పుడున్. 29

క. తాటాతూటమ్ముఁగఁబని
జూటాఫక్కీవి జేయు ♦ చుంచుజనాళుల్
పోటాపోటీలంగొని
తేటుగనొనరించుచుంద్రు ♦ తీటలుదీరన్. 30

క. కొండేలమార్లుజనముల
కుండెడు చెలుములను జెఱుచు ♦ కుటిలతఁ గనుచున్
బెండులగువారి నెంచక
యుండుటయే లెస్సచూడ ♦ నుర్వీస్థలిలో. 31

క. చిన్నతనానన్ స్వేచ్ఛగఁ
బిన్నల విడువంగరాదు ♦ పెద్దలదరినే
యున్నం జేకురు మేలులు
వెన్నులు ముదిరిన వెనుకనె ♦ విడువందగుఁ గా. 32

క. ధనపుం బట్టున్ వీడకు
మనిశము సుఖమైనరీతి ♦ నరుగుము సుమ్మా
కని పెరనేరము లెంచకు
మను గౌరవశాంతియుక్తి ♦ మనుజాళులలోన్. 33

క. న్యాయముగధనార్జనముం
జేయఁగవలెఁదాను మఱియుఁ ♦ జెన్నుగనిల్వన్
జేయుచునుండఁగవలయు ను
పాయముగాఁగొంతధర్మ ♦ పద్ధతివలయున్. 34

తే. గీ. ధనమునార్జించుచుండెడి ♦ ధరణిజనులు
పెద్దవారలలోపముల్ ♦ వెదకివంగు
నట్టులభినయ మొనరింతు ♦ రరసియితరు
లెలమిఁ దమపనిఁజూచుచు ♦ దొలఁగుచుండ్రు. 35

తే. గీ. శాంతికొఱకయికొందఱు ♦ జనులప్రేమ
కొఱకుఁగొందఱు ధనమును ♦ గోరికొంద
ఱెలమిగొప్పను పేరను ♦ వెలయఁగొంద
ఱిలను గార్యముల్ నెఱపుచుఁ ♦ జెలఁగుచుండ్రు. 36

క. ఎవనికి నెట్టిచ్చకమో
భువిలో నట్లభినయించి ♦ పొల్పగుధనముం
జవిదీఱసంగ్రహించుచు
భువిలోఁ జరియింతుర్లౌక్య ♦ పూర్ణులుభళిరా. 37

క. భృత్యత్వమభినయించుచు
నిత్యము ధనికాళితెల్పు ♦ నిపుణపువాక్కుల్
సత్యమ్ములనుచుఁజెప్పుచు
భత్యమ్ములుగొనుటలౌక్య ♦ ఘనులిదియహాహా! 38

తే. గీ. శక్తికొలఁదినిబనులను ♦ జలుపవలయు
కాని పోజిపన్కు పవరుకై ♦ కడఁగరాదు
దాన నహామదివృద్ధియై ♦ దండినిలుచు
జనములెటులుందురట్టులే ♦ చనుముతృప్తి. 39

క. ధనమేముఖ్యంబాయెను
జనులనువంచంగభయమె ♦ చనెఁబరమార్గం
బును నన్యోన్యసమిష్టిని
జనరాదొకో ! కలసిమెలసి ♦ శాంతాత్మకులై. 40

క. తనుదానుగడింపఁగవలె
జనములకొకయింతనీయఁ ♦ జనునెయ్యెడలన్
జనుఁగొంతనిల్వసేయఁగఁ
బనియేమిటికింకనితర ♦ వాంచలఁగోరన్. 41

క. ఇచ్ఛకమేధర్మంబై
యెచ్చోఁగాంచినను నదియ ♦ యేఁపుగనుండెన్
పచ్ఛగఁగనపడఁదలఁపులు
వచ్చిన నదిమెఱయువార ♦ వనితయపోలెన్. 42

క. ధనమునకొ కార్యమునకో
యనుకూలపుభృత్యులట్లు ♦ యగపడుదురుగా
పనితీఱినంతనేమఱి
కననొకభృత్యుండుచూడఁ ♦ గనఁబడఁడుగదా. 43

క. అధికారియెడల వినయం
బధికమ్ముగనిచ్చకంబు ♦ నలరుచునుండున్
సుధలొలుకు సిరులనీయఁగ
వ్యధలందొలంగనివియె ♦ యవసరమయ్యెన్. 44

క. లౌక్యమ్ము వైదికమ్ముల
జోక్యమ్ముంగలిగినరుఁడు ♦ సొబగగునట్లే
యైక్యతనన్నియుఁనడపఁగ
లౌక్యము రాణించుఁగాదె ♦ లాలిత్యముగన్. 45

క. శిష్టులు ధనగౌరవమును
శిష్టత్వము నెంచియెపుడుఁ ♦ జేయరుధాత్రిన్
దుష్టార్జనమ్ముగలిసిన
కష్టంబుదుఃఖములుదలఁచి ♦ కాదె? మహాత్ముల్. 46

క. అనువుగనల్పాహారం
బనువేళకుభోజనంబు ♦ పొసఁగుటబాగా
గనఁగట్ట మంచిబట్టయుఁ
జనుయోగ్యత దైవభక్తి ♦ సదయతగల్గన్. 47

క. స్త్రీలకుఁ జదువులునేర్పుట
కాలోచించెదరు జనము ♦ లదియెందులకో?
స్త్రీలేమి వ్యవహరింతురో?
వీలుగఁ గనిపెంచునట్టి ♦ వెలఁదులువారల్. 48

తే. గీ. కలసిమెలఁగుచు మనలోనఁ ♦ గలయఁదిరుగు
వారితప్పులు పేర్కొని ♦ పలుకరాదు
సగటుమాదిరినంచును ♦ జనఁగవలయు
తప్పుచేసినవారికిఁ ♦ దట్టునదియు. 49

క. దూరముననున్న వారల
నేరీతిని నన్నఁగాని ♦ యెవరికిఁగోపం
బారసి యిదితెలిసినవో
మీఁదిక యెంతయును శాంతి ♦ మేదినినిల్చున్. 50

తే. గీ మంచిపలుకంగఁగీడెందు ♦ మలయఁబోదు
చెడ్డఁజెండెడు తఱులందుఁ ♦ జితివకి
మైనదృష్టులుమౌనమ్ము ♦ లైనవలయు.
పొసఁగుసామాదికముశుద్ధ ♦ మూర్ఖునకును. 51

క. మంచియుఁజెడ్డయుఁ గనిజను
లెంచుచును నిజమ్ముఁగాంచు ♦ టిదిసహజమిలన్
గాంచవిచారణమే లే
యంచితమగునంకుశమ్ము ♦ యగునిదిప్రజకున్. 52

క. ఏపగిది నెవరుచేసిన
నోపిక జనులూరకున్న ♦ నుర్విని దప్పే
యేపుగఁబెరుగుచునుండును
నాపయిననణఁగంగఁదొక్కు ♦ టతికష్టమగున్. 53

తే. గీ. జనములనుకొంటధర్మమై ♦ బెనసియుంట
వినుచుఁ దనతప్పునవరించు ♦ కొనఁగవలయు
లేనియెడ మౌనముద్రను ♦ బూనవలయుఁ
గాని ఝుణఝుణలేచుట ♦ కరముతప్పు. 54

క. కొందఱుఁ గిట్టనివారలు
నందురు దుఃఖించునట్టు ♦ లతికఠినముగా
నెందును సరకుంగొనకుఁడి
కొందలమందంగఁజేయుఁ ♦ గూఢనువారిన్. 55

క. కొందఱు తమపనిఁజూతురు
కొందఱు వినియూరకుందురు ♦ గొడవలుతగ్గన్
కొందఱు సగటుననందురు
ఎందును దరిజనుని చేష్ట ♦ యెంచెదుతెఱులన్. 56

క. భృత్యత్వంబు తమస్సౌ
నిత్యముపైకిందులెంచ ♦ నిందుతమస్సౌ
నత్యంతగౌరవమ్మును
గృత్యముగాఁ గోరుచుంట ♦ కీడుతమస్సౌ. 57

తే. గీ. ఎంతొ తెలివైనవారమం ♦ చెసగుచుందు
పైక్షణమ్మేమిజరుగునో ♦ పట్టిచెప్ప
నట్టివారలుగాన్నరా ♦ రవనినిపుడు
జ్యోతిషముఁజెప్పి రెంతటి ♦ సూక్ష్మమతులో ! 58

క. నిజముందాచఁగఁదరమా ?
నిజమునుగాంచంగఁబ్రజలు ♦ నేర్తురుభువిలో
నిజపంథఁజనఁగమేలగు
గజిబిజియెంతయునడంగుఁ ♦ గాజనములలోన్. 59

క. నైజములుమార్పఁగష్టము
సైజోడుగఁగూడుచుండుఁ ♦ జతురపుఁజెలుముల్
మైజారుచుండునట్లె బ
డేజావులెసంగుచుండు ♦ డీకొనుకడిమిన్. 60

క. తనలోపములంగనుఁగొని
యనిశముజనులెంతురనుచు ♦ ననుమానించున్
గనుఁగొననియ్యదిమేలే
యనుమానములన్నినిజము ♦ లౌనాజగతిన్. 61

క. ఏనైజంబెట్టిదియో
పూనికనెఱుఁగంగవలయుఁ ♦ బోలుపదియగుఁగా !
మానుపఁగనేరుచాలుదు ?
రీనీతిమెఱుంగవలయు ♦ నిలలోజనముల్. 62

క. చెడునైజంబేమైనన్
విడువందగు లేదో యనుభ ♦ వింపఁగవలయున్
దడయకతాటస్థ్యముదగు
విడివడిపుట్టినగుణంబు ♦ వీడదుసుమ్మీ. 63

క. ఒక్కొక్క దేహధారికి
నొక్కొక్కటిలోపమొందు ♦ నుండియెతీఱుఁ
మక్కువలొంగఁగవలెఁగా
తక్కినయేన్నిద్దటస్థ ♦ తఱ జనవలెఁగా. 64

క. నిజమైనదగుటగొప్పా?
గజిబిజిగాజనులమనము ♦ గప్పుటగొప్పా?
గిజగిజలాడుటగొప్పా?
గుజగుజగా జనులలోనఁ ♦ గూడుటగొప్పా? 65

క. ద్యూటీయన్నదిముఖ్యము
ద్యూటీచేయంగవలయు ♦ నొప్పగునెందుఁ
మాటికి నితరము లెంచుట
పాటవమగుదుఃఖమార్గ ♦ పద్ధతిధరలోఁ. 66

తే. గీ. కులసతీమణిదుఃఖాబ్ధి ♦ గుందుచుండఁ
జేతిసొమ్మెల్లవ్యర్థమై ♦ చెడుచునుండ
గౌరవమ్మెల్లగంగలోఁ ♦ గలియుచుండ
వేశ్యలంగూడి చెడనేల? ♦ వెఱ్ఱులార! 67

తే. గీ. అహము లెసఁగినఁబనిలేక ♦ యలరుచున్న
దెబ్బలాటలవారైన ♦ దిగునుగలహ
మలరనహములుతగ్గినఁ ♦ గలుగఁబనియు
లొంగిపోయినభువిలోఁ జె ♦ లంగుశాంతి. 68

క. పరమనముల నొప్పింపని
గరువపు రీతిని మెలంగి ♦ కడు నేర్పరులై
విరసముగఁ జూచి వక్రత
మెఱయుచు ధరఁ దిరుగుచుందు ♦ మేలగు జనముల్. 69

క. అతివీడు మెల్ల యెడలన్
సతతమ్మును మధ్య బాట ♦ జనఁగన్ మేలౌ
హితమగు తృప్తిం జెందుము
మతికిం దుఃఖమ్ము దెచ్చు ♦ మార్గము విడుమీ. 70

క. అందఱి క్షేమము గోరుము
అందఱికిని మేలు సేయు ♦ మారసి యెపుడున్
జెందకు పరమార్గంబుల
సందియమింతయును లేక ♦ చను ఋజురీతిన్. 71

క. తన గౌరవమ్ము కోఱకై
యనుమానింపక యపరుల ♦ యధికత నుంగ
న్గొని న్యూనత గామార్చును
మనుజాళికి దెంత నీచ ♦ మార్గమొ తెలియన్. 72

క. అతి ఘనత నుగోరకుమీ
యతి నీచత్వమున కెప్డు ♦ డలవడకుసుమీ
యతి మిగుల దుఃఖ హేతువు
కుతుకమ్ముగ మధ్య బాటఁ ♦ గొని నడువుసుమీ. 73

క. గౌరవముం దమ యునికియుఁ
గోరిక సామాన్యరీతిఁ ♦ గొందురు ప్రాజ్ఞుల్
మీఱక తమపనిఁ జూతురు
చేరరు మేలిడఁగలేని ♦ చెనఁటులచెలిమిన్. 74

తే. గీ. ఎన్నో శక్తులుగలవటం ♦ చెసఁగుచుండ్రి
విషయవేగమ్ము లడఁచుచు ♦ వింతసుఖము
నొందఁగల్గినఘనులేరి ? ♦ యుర్విఁజూడ
నీలుగొక్కటినిల్చెఁగా ♦ నిలనుగాంచ. 75

తే. గీ. దేవుసృష్టినిగల్గిన ♦ దీవ్యదణువు
నైనఁ బత్రమ్మునైన నీ ♦ యవనిఁబూర్తి
గాఁగఁ దెలియంగఁగల్గిన ♦ ఘనుఁడు కలఁడె?
తెలివియను భ్రాంతియొక్కటే ♦ యలమెగాని. 76

క. తనశ్రేయమ్మునె గోరుచుఁ
దనకున్మేలులను జేయఁ ♦ దలఁచుచు నెపుడుం
జన నీచత్వమె గోరుచు
జను వారిం బెద్దలనఁగఁ ♦ జనునే? యెందున్. 77

తే. గీ. ఇలనుగలవస్తువులకైన ♦ చెలువునెంచ
దేనిపోలిక దానిదే ♦ తెలియనెందు
నట్టివానికిఁ బోలిక ♦ లరయుచుండు
నల్పబుద్ధులనేమని ♦ యందుభువిని. 78

తే. గీ. విషయవాంఛల నశ్రద్ధ ♦ విధినివిడిచి
విషయబాహ్యాతముదితుఁడౌ ♦ వింతవానిఁ
బామరులు కొద్దిగొప్పల ♦ పాటినెంచు
జడతనేమనిమెంతునీ ♦ పుడమియందు. 79

క. అనుకొన్న యదియసరియా?
అనఁగానే యదియధర్మ ♦ మాంచతురతఁజె
ప్పినమాట నమ్మఁదగునా?
కనుచెవి విషయములవిడిచి ♦ కాంచుమునిజముల్. 80

క. తమయిష్టమె చట్టంబఁట!
విమలంబగుధర్మనీతి ♦ విధిఁగనరఁట హా!
తమ పెరశ్రేయముగనరఁట
కుమతులు ప్రబలంగశాంతి ♦ గూడుటయెట్లో. 81

క. ధనగౌరవ యోగ్యతలం
గని పెట్టుచు జనులలోనఁ ♦ గడునేర్పరులై
యనవసరవ్యయమున్విడి
మనియెదరిలలోనమిగుల ♦ మాన్యజనంబుల్. 82

క. కాంతా ధనగౌరవముల
కెంతయుఁ గలహించుచుందు ♦ రీభువిలోనన్
వింతగఁ బెరకోరికవిడి
నంతనె దుఃఖమ్ములడఁగు ♦ నౌగా ప్రజకున్. 83

క. ఇంకను గొంచెము యోగ్యత
యింకను గొంచెమ్ము భక్తి ♦ యించుకజ్ఞానం
బింకను నుండుటచేత నె
జంకక భువినిల్వఁగల్గె ♦ జలప్రళయముకై. 84

క. బంధుజనగౌరవమ్మును
బంధుజనప్రేమవిడిచి ♦ బలుతుచ్ఛుండై
యంధతఁ దనగొప్పకునై
సంధిత్తఁగ నొక్కఁడొకఁడు ♦ చరియించుధరన్. 85

క. తనగొప్పయె కోరుననఁగ
ననుమతిఁ బరనైచ్యమెంచు ♦ ననుటయగాదే?
గనఁగను దుంటరియాతఁడె
యనుకూలపుశత్రువనఁగ ♦ నమరుంబ్రజకున్. 86

క. తగఁదనగొప్పయెకోరుచు
నగణితముగలెక్కపెట్టు ♦ నాతనిఁగనుచున్
దగుఁదగుఁబై వెలయంగను
దగునిరసనచేసిచూడఁ ♦ దగునెయ్యెడలన్. 87

క. తనగొప్పయెకోరెడియా
మనుజాధముతోడఁగలసి ♦ మసలుటమేలా?
కనసర్పసఖ్యమనఁదగు
నెనయంగాదగదువాని ♦ నీక్షితియందున్. 88

సీ. యోగ్యతమెచ్చియు ♦ యోగ్యత శిక్షించి
గర్వంబునీలుగు ♦ క్కణచిమించి
డాంబికరీతుల ♦ డంబంబుధట్టించి
పరహేళనకువేడ్క ♦ ఘటిలిమట్టి
సర్వజనప్రేమఁ ♦ జక్కఁగాశ్లాఘించి
స్నేహరీతినరుల ♦ చెలిమిమెలఁగి
పరులభృత్యులుగాఁగఁ ♦ బఱికింపఁగోరక
కించయనునదియు ♦ కింతగనక

తే. గీ. పరులసేమమ్ముఁగోరుచు ♦ నిరతిమేలు
చేయుచందఱుహాయిగాఁ ♦ జెలఁగఁగోరి
యుచితరీతినిఘనతర ♦ యోగ్యవృత్తి
ధరఁ జెలంగెడువారలే ♦ ధన్యతములు. 89

సీ. జనములు నడతలఁ ♦ జర్చించుతఱులందు
నీరీతిఁ జర్చించు ♦ టిలకుఁదగును
పరబాధలేకుండఁ ♦ బరఁగినాఁడో లేదో
పరమయోగ్యుండనఁ ♦ బడెనో లేదో
తాఁదినియొకరికిఁ ♦ దగనిడెనో లేదో ?
పెరతిండిఁజెఱుపక ♦ పరఁగినాఁడో
తనపనినెఱపుచు ♦ దైవభక్తియుఁగల్గి
ధరనుండెనో లేదో ♦ ధన్యుఁడగుచు

తే. గీ. నసుటశాంతి; యందలము పై ♦ నలరినాఁడొ
అమితమగుజరీబట్టల ♦ నమరినాఁడొ
పైఁడిమేడలఁగట్టుచుఁ ♦ బరగినాఁడొ
యనుచు వ_త్తిడియెంచుట ♦ యసలెతగదు. 90

క. అన్యోన్యసామ్యభావం
బన్యోన్యప్రేమభావ ♦ మవనీజనులం
దన్యోన్యదాసభావము
మాన్యతశోభలునుగల్గి ♦ మహిఁవెలయుఁదగుఁ. 91

ఆ ధ్యా త్మి క ము.

క. మహదానందమ్మొసఁగెడు
మహితులు నాళ్వారులాది ♦ మాన్యులువే_త్తల్
మహిలోఁ బ్రిపన్నకోటులు
సహజంబుగవారు మాకు ♦ సంబంధులెగా. 92

క. ధరజనములెట్టివిధులం
జరియింతురొ యట్టివిధులఁ ♦ జక్కఁగనాయా
గరిమమ్ములెంచి మెలఁగుడు
మరయఁగనంటనివితాన ♦ నవనీస్థలిలోఁ. 93

క. లీలా సంచారినమ
స్త్రైలా రంగంబునందు ♦ నృత్యముసేయుఁ
జాలగ ధనికులకంటెను
మేలగునానందవార్ధి ♦ మెఱయుచునుండుఁ. 94

క. ధనమును గరువము యోగ్యత
యును విజ్ఞతభక్తియుక్తి ♦ యుఱుతరవిద్యల్
గన నన్నిగల్గి నిండుగ
జనములనంటకయె మనము ♦ చరియింపఁదగుఁన్. 95

క. జనముల యిష్టంబెట్లో
యనువుగ మనలీలలట్లె ♦ యలరుచునుండున్
మనుజులదోషములంటని
ఘనమైనసురూపమవనిఁ ♦ గైకొనియుంటన్. 96

క. వెనవెనజనములు మనయెడఁ
బసలేని రిమార్కులెన్న ♦ పసనెంచముగా
యసమానరీతినంటక
విసవిసజనులందుఁ దిరుగు ♦ పేర్మింగనుటన్. 97

క. భగవద్ధర్మంబెటఁగన
నగునయ్యెడ నలరుచుండు ♦ నో మావినుతుల్
దగమాతేమియుఁ గోరము
జగతిని సుజ్ఞానభక్తి ♦ జలధులమగుటన్. 98

క. అన్యులసుఖమునెకోరుదు
మన్యులదుఃఖమునుగోర ♦ మారయనెపుడున్
మాన్యత్వమెందుఁ జూతుము
దైన్యము పాత్రజ్ఞునికిఁగలదె? ♦ ధాత్రిందెలియన్. 99

క. అజ్ఞుఁడు నీచానందుఁడు
విజ్ఞుఁడు సంపూర్ణసౌఖ్య ♦ విధముననుండున్
ప్రాజ్ఞునియెదుటను దనదు
ప్ర్రజ్ఞలకై యతిశయించుఁ ♦ బామరుఁడేలా ? 100

క. పామరజనచిత్రమ్ముల
నామహితుఁడు బాలువేడ్క ♦ లల్లించునుగా
యేమియును బాటిసేయం
డామహితునకనఁగ లెక్క ♦ యగునే యవియున్. 101

క. కోపము ధర్మముఁజెఱుచును
గోపమున మనమ్ముచెడును ♦ గుణములు వీడున్
గోపమ్ము తృణసమానము
కోపమ్మును బాయవలయుఁ ♦ గువలయజనముల్. 102

క. కోపము నీచగుణమ్మని
యోఁపున విజ్ఞాళివీడి ♦ యొనఁగుదురిలలోఁ
గోపమున ధర్మమడఁగును
కోపము గీపమును లెక్క ♦ గొందురె ? వేత్తల్. 103

క. ధనమే దైవము బంధువు
ధనమే సర్వమ్మటంచుఁ ♦ దలఁచి నిరతమున్
మనముల నితరముల్లెంచక
ధనపథమునఁ బోవుచుందుర ♦ ధాత్రిజనముల్. 104

క. కొద్దియు గొప్పయు ననునా
సుద్దియ నీచత్వమిలను ♦ జూడఁగ నెంతే
యెద్దెన యోగ్యతపరఁగునో
యద్దెన సమభావము నుప ♦ నోఁగా ధరలోఁ. 105

క. ధనమేముఖ్యము పామర
మనుజాళికి నన్నమాట ♦ మదిలోపలఁ గ
న్గొని యందందులవేత్తలు
ధనముం దృణలీలనెంచి ♦ ధరఁ దిరుగుదురా. 106

క. అనిశము పరదైన్యంబే
కనవిననఁ దనివిగాంచు ♦ కడుతుచ్ఛమతుల్
మనియెదరు వారిమొగములఁ
గనుఁగొనఁ బాపమ్ములొదవుఁ ♦ గా జనములకున్. 107

క. మహితమహానందంబే
సహజంబుగఁ గల్గియుండెఁ ♦ జపలతదేహం
బిహమున విషయనిమగ్నత
నహా! పొందెడుసుఖముసుఖమె? ♦ యదియునులెక్కా.

క. అంటుచు నంటనివారలు
మింటికి మంటికిని మించు ♦ మేటులుగారే?
యంటెననుకొందు) సాత్వికు
లంటకయే వారలుందు ♦ రవనీస్థలిలో. 109

క. మెలకువ దేవునిగనుఁగొనఁ
గలిగినయది తెలివిగాక ♦ కరముపఠించ
మ్ములఁదెలియు తెలివి తెలివియె ?
తిలకింపఁగ నట్టిరీతిఁ ♦ దెలియందగుఁగా. 110

క. దేహాపుమంచినిఁ జెడ్డను
దేహము తానన్నవాఁడు ♦ దిటవుగఁబొందున్
దేహాపుమంచినిఁ జెడ్డను
దేహము తాననని వాఁడు ♦ తిలకించునొకో ! 111

క. తిండియు గుడ్డయు యోగ్యత
యుండిన నేచాలునంచు ♦ నుచితప్రాప్తిం
దండిగొను గౌరవాదుల
నొండేమియుఁ బాటిసేయ ♦ రున్నతశాంతుల్. 112

ద్విపద.

పరమాత్మబోధచే ♦ విలసిల్లుజ్ఞాని
పామరానందమ్ముఁ ♦ బాటించునెట్లు ?
అతిశయనీచత్వ ♦ మరయుదానుండు
వితతాతిశయరీతి ♦ వినుతించునెట్లు
సమతాత్మవిద్యచేఁ ♦ జతురుఁడౌజ్ఞాని
విమతపామరధర్మ ♦ విధమెన్నునెట్లు
యోగనిద్రాసక్తి ♦ నుండుభక్తుండు

భోగముద్రారక్తిఁ ♦ బొంగఁగనెట్లు
పొట్టపోషించుచుఁ ♦ బొదలునజ్ఞాని
గట్టియాత్మవిదుండు ♦ గణుతించునెట్లు
దేహమే తానంచుఁ ♦ దెలియుపామరుని
యూహఁబ్రపన్నాళి ♦ యొప్పఁగానెట్లు
జనతటస్థత చేత ♦ జరుగుసుజ్ఞాని
గనిభిన్న రీతులఁ ♦ గణుతింత్రుజనులు
అలరదటస్థుఁడై ♦ యమరెడుజ్ఞాని
కలసిమెలసియిలఁ ♦ గ్రాలఁగానెట్లు
విషయవిరాగియై ♦ వెలయుభక్తుండు
విషయంబులకులొంగి ♦ విహరించునెట్లు
దేహానిత్యత్వంబు ♦ దెలియుభక్తుండు
దేహేంద్రియాసక్తిఁ ♦ దివ్వరఁగానెట్లు
జనులలోజన్మించి ♦ చరియించుజ్ఞాని
మనుజులవిడనాడి ♦ మఱిపోవునెట్లు
జనులందులీలతోఁ ♦ జరియించుజ్ఞాని
ఘనమనీషిగనెంత్రు ♦ గాబోధవరులు
అంటియంటనిరూప ♦ మాతండెనిజము
కంటిచేసేవింపఁ ♦ గలుగుగాఫలము
హెచ్చుతగ్గులులేక ♦ యొసఁగుసుజ్ఞాని
హెచ్చుతగ్గులవారి ♦ నెంచుటయెట్లు

నగునెయెవ్వరికైన ♦ నాచిత్రమెంచ?
జ్ఞానంబుభక్తియు ♦ జనములకెల్ల
సానందమార్గంబు ♦ లౌనివిరెండు
భగవద్విలాసత ♦ త్పరతచేఁజొక్కు
సగుణభక్తులుమాకుఁ ♦ జక్కనౌప్రియులు
పరగనిర్గుణతత్వ ♦ పరులుయోగులును
నిరతిమాక్లిష్టులై ♦ నెగడుచునుంద్రు
శంకరరామాను ♦ జార్యమాధ్వులజ
యాంకితంబులుశ్రుతు ♦ లందునుగనుచు
జనులమహానంద ♦ సమితినిగోరి
ఘనులఁజిదానంద ♦ కలితులఁజేయ
విమలుండమరవాది ♦ వేంకటార్యుండు
క్రమభక్తివిజ్ఞాన ♦ గతిఁబల్కెనిట్లు. 113

## మధురగతిరగడ.

భువిలోశోభలు - పొలుచునుగావుత
దివిభువిఁగీర్తులఁ - దేజములీవుత
జనములుసమ్మద - సమితినివెలయుత
మనిశముశ్రేయము - లన్నియుఁగలియుత
ఘనకరుణారస - కమ్రితచెలఁగుత
మనుజులవేడ్కలు - మఱిమఱిమెలఁగుత. 114

క. మంగళము దివ్యమూ ర్తికి
రంగుగలాలియును జోల ♦ రాధాపతికిన్
బంగారుతొట్లనుంచి చె
లంగుచు నూచెదము మనము ♦ లన్ ముదమలరన్. 115

క. మంగళము దివ్యకీ ర్తికి
మంగళము ప్రతాపవిజిత ♦ మార్తాండునకున్
మంగళము భవ్యమూ ర్తికి
మంగళ మానందరాజ ♦ మానస్థితికిన్. 116

మాలిని. సదయసుగుణశాలీ ♦ సన్మనోమోద కేళీ
విదళితభవ తాపా ♦ వేణునాదానులాపా
మృదులపదసరోజా ♦ మేదురాదిత్య తేజా
విదిత వివిధ రూపా ♦ విశ్రుతానందదీపా. 117

---

ఆ. వె. అమరవాది వేంక ♦ టాచార్యవర్యుండు
పద్యరూపకముగ ♦ వ్రాసినట్టి
సూ క్తిమంజువాణి ♦ యుర్వీజనానన
స్థలులన్నృత్య కేళి ♦ సలుపుఁగాత! 118

---

ఓంతత్సత్ — భగవద్భాగవ తాచార్య తిరువడిఘళేశరణమ్.

## మంగళహారతులు

### నాటకురంజిరాగము — రూపక తాళము.

1. మంగళం శ్రీరామదేవమహితా - భక్తుల
కొంగుబంగారనఁగ వెలసిన - గుణరత్న సహితా ॥ మం ॥
2. మకరకుండలభూషణకలితా - ప్రకట
సకలశత్రుచయమ్ముఁద్రుంచిన - సామిభువనలలితా ॥ మం ॥
3. అలవిభీషణుఁబ్రోచినట్టిభూపా - నీకుఁ
దులగలదె యీభువనములలో - పఁటనుసత్ప్రతాపా ॥ మం ॥
4. నీవువిడిచినశరమునకును దిరుగు - లేదు
పావనుఁడనీనోటిమాటక్కుఁ - బ్రతియెట్లుజరుగు ॥ మం ॥
5. అమరవాది వేంకటార్య సామీ - నీవు
విమలుఁడవు మముఁనేలువాఁడవు - వెఱపుమాకికనేమీ ॥

( బ్యాండుస్వరము. )

1. మంగళంమంగళం - మహిత ప్రేమవారిధీ
రంగరంగకుమతభంగ - రమ్యసుగుణధీనిధీ ॥ మం ॥
2. నిన్నెయెప్పుడాత్మఁగోరి - యున్నవాఁడభూధవా
నన్నుఁ బ్రోచుచుండునన్నుఁ - జక్కనేలుమాధవా ॥ మం ॥
3. కలసిమెలసిమమ్మువిడకు - కమలపత్రవీక్షణా
తెలిసితెలియకున్నామయ్య - దితిజకూటశిక్షణా ॥ మం ॥
4. అమరవినుతయఘవినాశ - యార్యకల్పభూజమా
విమలరూపనిత్యసత్య - వేదవిదితతేజమా ॥ మం ॥
5. అమరవాది వేంకటార్యు - నంటియుండురూపమా
ప్రమదలీలజనులఁబ్రోచు - భాస్వరప్రదీపమా ॥ మం

Sree Savitri Press, Cocanada.

